# శ్రీకృష్ణ స్తోత్రత్రయము

అనుసృజన :

ఆచార్య ఎస్. గంగప్ప

శశీ ప్రచురణలు

సి /73, శ్రీనివాస నగర్ కాలనీ,

గుంటూరు - 522006

# శ్రీకృష్ణ స్తోత్రత్రయము

- ఆచార్య ఎస్. గంగప్ప



ప్రథమ ముద్రణ : జులై, 2000

ప్రతులు :1000

వెల రూ.: 30/-

ముఖపత్ర చిత్రణ : శ్రీ పోతురాజు శ్రీనివాసరావు

**ప్రతులకు**
శ్రీమతి ఎస్. పార్వతమ్మ
శశీ ప్రచురణలు,
సి /73, శ్రీనివాస నగర్ కాలనీ,
గుంటూరు - 522006
ఫోన్ : 231805

ముద్రణ: శ్రీ విజయలక్ష్మి ప్రింటర్స్,
8/2 అరండల్‌పేట, గుంటూరు - 2.

# ఇందులో......





# అభినందన

''హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా!
హరి నీ నామ మహత్త్వము
హరి హరి పొగడంగ వశమె హరి ! శ్రీకృష్ణా!''

ఆచార్య గంగప్పగారు రచించిన ''శ్రీ కృష్ణస్తోత్రత్రయము''ను చూచినప్పుడు ఎప్పుడో చదివిన పై పద్యము నాకు తోచినది. ఎన్ని గ్రంథములు రచించినను, ఎన్ని ప్రబోధములు చేసినను ఇష్టదైవమును సేవించుటయే మానవుని కర్తవ్యము. తక్కిన కార్యములు కీర్తి కేతనమును విను (జన) వీధులలో రెప రెపలాడించును. దైవ కీర్తనము ఆర్తిని బాపి స్వాంతఃసుఖమును కలిగించును. ఈ కీలకమును అనుభూతము చేసికొన్న మహానుభావుడు శ్రీ గంగప్పగారు.

కవిత్వమునకు అలంకారములు ముఖ్యమన్నమాట వాస్తవమే. అంతకంటే ముఖ్యమైనది అహంకార పరిత్యాగము. వక్రోక్తి, ధ్వని మొదలయిన ప్రస్థానములు కవిత్వమును సుకుమార హృదయులకు దూరమొనరించినవి. ఇది మాదృశుల నిశ్చితాభిప్రాయము. ఆచార్య గంగప్పగారు సుకుమారమతి. అందువల్లనే సంస్కృతమందలి లలిత శ్లోకములకు సముచితమయిన అనువాదమును సమకూర్చిరి. ఎన్నెన్నో పర్యాయములు నిత్యపారాయణ సత్యానుభవము గడించి పండిన నిండు హృదయముతో ఈమూడు గ్రంథములను అనువదించిరి. తాము పొందిన అనుభవమును పదుగురితో పంచుకొనుటయే తమ లక్ష్యము. ఆ లక్ష్యము చక్కగా నెరవేరినది. విలుకాడు ఒక లక్ష్యమున

నాటుకొనునట్లు బాణమును వేయగా, అదే లక్ష్యమును అనువాదకుడు బెసకకుండ భేదించినయెడల లక్ష్యము నెరవేరినట్లే. ఇది పూర్వోక్తమే.

ఆచార్యగంగప్పగారి ఆచార్యత్వము లోకవిదితమే. ఆధ్యాత్మిక ప్రస్థానగామిత్వము ఆంతరంగికము. అదే వారికి ఆనందదాయకము, ఆశయ సాధకము అని ఈ గ్రంథమును బట్టి స్పష్టమగుచున్నది. ఇది పాఠకులకు ఇష్టము కాగలదు. అట్లేయగుగాక! తథాస్తు!

స్ఫూర్తిశ్రీ



# తెలుగు వెలుగులు

సహజ రచనా విచక్షణుడు, విమర్శనా నిష్ణాతుడు, బహుగ్రంథ రచయిత, పరిశీలిత పదకవితా సారస్వతుడునగు విశ్రాంతాచార్య శ్రీ గంగప్ప గారి లేఖిని నుండి శ్రీకృష్ణాష్టక, శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్ర, శ్రీకృష్ణ గోవింద మాధవ స్తోత్రత్రయికి అనుసృజనాత్రయిగా తేట తెలుగు తేటగీతులుగా రూపొంది వెలుగులోనికి వచ్చిన యీలఘుకృతులు మూడును జిజ్ఞాసుజనతకు ఉపాదేయములై యున్నవి.

*గంగప్పాజీ! ధీమాన్!*
*గంగాలహరీ విధాన గమియించెడి మీ*
*రంగ దభంగిని లేఖిని*
*అంగీకృత సరసవాఙ్మయా! జయ! జయహే!*

*ఇతిశమ్!*

ఇట్లు

గుంటూరు – 6
30–1–2000

**ఆకురాతి బసవయ్య**
రిటైర్డు తెలుగు పండితులు.

# ప్రవేశిక

ఇటీవల 'శ్రీరాధాగోవింద స్తోత్రమాల' నాకు లభించడం ఒక విశేషం. గుంటూరు స్తంభాలగరువులో శ్రీకృష్ణచైతన్య ధామములో శ్రీప్రమాదినామ సంవత్సరవైశాఖ బహుళాష్టమి నాడు శ్రీరాధాకృష్ణులు, శ్రీ చైతన్య మహాప్రభువుల విగ్రహ ప్రతిష్ఠాపనా మహోత్సవ సందర్భంలో త్రిదండి శ్రీభక్తి శోభన ఆచార్య మహరాజ్ వారి సంపాదకత్వంలో శ్రీకృష్ణ చైతన్యధామ నిర్వహణ సమితి వారు ఈ గ్రంథాన్ని ప్రకటించారు. ఈ గ్రంథాంతంలో 'శ్రీగోవింద దామోదర స్తోత్రముంది. స్తోత్ర పఠనాసమయంలో ఈ స్తోత్రం నన్నెంతగానో ఆకర్షించింది. ఇది శ్రీ బిల్వమంగళ కృతమని తెలిసింది. అందులో 70 శ్లోకాలున్నాయి. అలవోకగా 70 తేటగీతల్లో అనువదించాను. ఎంతో సంతృప్తి కలిగింది. అలాగే నేను నిత్యమూ పారాయణం చేసుకొనే శ్రీకృష్ణాష్టకమూ, శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రమూ – ఒకింత క్లిష్టమైనా – శ్లోకాలను తేటగీతల్లోనికి అనువదించాను. నాకు మరింత సంతృప్తి, హాయి, ప్రశాంతి లభించాయి. ఆనందమే దాని ఫలితం. 'స్వాంతస్సుఖాయ' ముఖ్యమైందిగదా!

ఇప్పుడూ ప్రతినిత్యమూ ప్రభాతసమయాన శ్రీకృష్ణాష్టకమూ, శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రమూ, ఆదిత్య హృదయమూ పఠించడం నాకు మనస్సంతోష కారకం, ప్రశాంతి ప్రదాయకం. వీటితోపాటు ప్రతి శనివారమూ శ్రీవేంకటేశ్వరసుప్రభాతం పారాయణం కొనసాగిస్తున్నాను. అయితే ఇతఃపూర్వం చాలాకాలం బృహస్పతి స్తోత్రమూ, శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రమూ పఠించడం జరిగింది. వాటి సత్ఫలితాలు నాకు అందివచ్చాయి భగవత్కృపావిశేషంతో.

సుమారు మూడు దశకాల ముందే నేను శ్రీకృష్ణ శతక రచన కంద పద్యాల్లో చేయనారంభించాను. నలభై పద్యాలకు పైగానే రచించాను. కాని ప్రభుత్వోద్యోగంలో బదిలీల కారణంగా ప్రయాణాల్లో ఆ నారచన ఏమైందో లభించలేదు. మళ్లీ నేను రచన చేయలేకపోయాను. అదొక సంఘటన.

ఇది మరో సంఘటన. నా కంటి శుక్లాల శస్త్రచికిత్సానంతరం జరిగింది. శ్రీకృష్ణస్తోత్రత్రయము' అనే పేర శ్రీకృష్ణాష్టకమూ, శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రమూ, శ్రీకృష్ణ గోవింద మాధవ స్తోత్రమూ – అనే మూడింటిని కలిపి ప్రకటించాలన్న కోరిక ప్రగాఢంగా నిలిచింది. ఇదంతా భగవదనుగ్రహమే.

సర్వదా నా మనస్సు సాహిత్య పఠన పాఠనాలతోపాటు పరిశోధ నాత్మక కృషిలో సంలగ్నమైనా ఆధ్యాత్మిక చింతన అంతర్లీనంగా కొనసాగుతూనే ఉంది. క్షేత్రయ్య పదసాహిత్య గ్రంథ రచనానంతరం, వాగ్గేయకారుల పదకవితా కామనీయకంతో పాటు, వారుద్దేశించిన భక్తి పరతంత్రత, ఆధ్యాత్మిక చింతనాపరత్వం నాలోను చేకూరి, ''అన్నమాచార్య ప్రముఖ వాగ్గేయకారులు – తులనాత్మక అధ్యయనం, అన్నమాచార్య సంకీర్తన సుధ'' అనే గ్రంథాల ప్రకటనతో ఆమార్గంలో నాకెంతో సంతృప్తిని చేకూర్చింది. ప్రాచీనాధునిక సాహిత్యంతో పాటు, పద, జానపద, నాటకాది సాహిత్య ప్రక్రియలన్నింటా నేను చేసిన, చేస్తున్న నానిరంతర సాహిత్య కృషి జగమెరిగిన సత్యం. సృజన, విమర్శ రెండంచులుగా సాగిన నా సాహిత్య కృషిలో ఇదో అంతర్లీనమైన భగవచ్చింతన. ఏపేరున స్మరించినా పరమాత్మ ఒక్కడు, సర్వవ్యాపి, సర్వాంతర్యామి.

సుధర్మ
శ్రీ ప్రమాదినామ వత్సర
విజయదశమి

ఎస్. గంగప్ప

# కృతజ్ఞతలు

నాయీ రచన వెలుగు చూడడానికి ఆర్థిక సాహాయ్యం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి గారికి, కార్యనిర్వాహక వర్గానికి....

నాకృషిని ప్రశంసించి, అభినందించి, నా అనుసృజనకు తగిన సలహాలనొసగిన విద్వద్వివర్శకులు, కమనీయ కవితల్లజులు, శ్రీ సాయిభక్తి ప్రవీణులు, పూజ్యులు, 'స్ఫూర్తిశ్రీ' టి. భాస్కరరావు గారికి....

నా నిరంతర సాహితీ వ్యాసంగాన్ని, ప్రస్తుత అనుసృజననీ ఎంతగానో మెచ్చుకొని తెలుగువెలుగులు వెలారించిన విశ్రాంతాంధ్ర పండితులు మాన్యవర్యులు శ్రీ ఆకురాతి బసవయ్య గారికి......

.. నా కృజ్ఞతాభివందనాలు!

నాయీ స్తోత్ర రచనలోని ప్రతి పద్యమక్షర మక్షరం పరిశీలించిన వర్థిష్ణువు మా అల్లుడు డా. గుమ్మా సాంబశివరావుకు ఆశీరభినందనలు!

శుద్ధప్రతి సిద్ధం చేసిన నా శిష్యుడు, ప్రాజెక్టు ఫెలో చిరంజీవి ఎన్. వి. కృష్ణారావుకు ఆశీస్సులు !

ముఖపత్ర చిత్రణలోనూ, ముద్రణలోనూ అన్ని విధాలా సహకరించిన మిత్రులు శ్రీపోతురాజు శ్రీనివాసరావు, డాక్టర్ వి. సింగారావు గార్లకు అభినందనలు! అందంగా, సకాలంలో ముద్రించి ఇచ్చిన విజయలక్ష్మి ప్రింటర్స్ వారికి ధన్యవాదాలు.

ఎస్. గంగప్ప

This book is published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under the Scheme AID TO PUBLISH RELIGIOUS BOOKS

# అంకితము

1. కరుణ ప్రహ్లాదు గాచిన పరమపురుష!
రభస ద్రౌపదీ మానసంరక్షకుండ !
మదకరీంద్రు గాపాడిన మదనజనక !
నతులు పెనుకొండ శ్రీకృష్ణ ! నందతనయ !

2. పూతనాజీవన హరణ పూతచరిత !
అఘ బకాసుర సంహార హారి వీర !
నీరజాక్ష ! శౌరీ ! నవనీత చోర !
నతులు పెనుకొండ శ్రీకృష్ణ ! నందతనయ !

3. వీర బలరామ సోదరా ! పీతవసన !
ప్రియతమా ! సుభద్రాగ్రజా ! వీతరాగ !
నరసఖా ! నారసింహా ! అనంత రూప !
నతులు పెనుకొండ శ్రీకృష్ణ ! నందతనయ !

4. రహిని గోగోప గోపికా రక్షణ చణ !
గోప బాలుర నేస్తమా ! గోప బాల!
సారసాక్ష ! వంశీధరా ! శ్యామ దేహ !
నతులు పెనుకొండ శ్రీకృష్ణ ! నందతనయ !

5. రక్షకుడవు మాకు తరతరాలనుండి
వీగలేదు వదలలేదు వెనుబలమయి,
కీర్తి సంపదలిచ్చితి గిరిధరుండ !
నతులు పెనుకొండ శ్రీకృష్ణ! నందతనయ !

6. శాపమిచ్చి గ్రహింపగ శక్తుడొకడు
బహు సమర్థుడాపగ పరవల్లవాగు
పూర్వు లస్మదీయులు శక్తులుర్విలోన
నతులు పెనుకొండ శ్రీకృష్ణ! నందతనయ !

7. నెమ్మి గంగాభవాని వరమ్ము గలదు
అమ్మ నన్నోము, కృష్ణుని దయయు గలదు
తల్లి దండ్రులు చూతురు దయదలిర్ప
విద్య వినయముల్ బడసితి వేగ మేను
నతులు పెనుకొండ శ్రీకృష్ణ! నందతనయ!

8. మోక్ష దాయి హరిస్తోత్రములివి మూడు
అనువదించితి, నిచ్చితి నంకితమ్ము
కృష్ణ! గైకొమ్ము మోదాన కృపదలిర్ప
నతులు పెనుకొండ శ్రీకృష్ణ! నందతనయ !

9. వాసి గనిన శ్రీరామప్ప వంశజుండ,
వినుతు లందితి గంగప్ప పేరుతోడ
ఇష్టదైవమా! కృష్ణ! నీ అష్టకమిది
నతులు పెనుకొండ శ్రీకృష్ణ! నందతనయ !

# శ్రీకృష్ణాష్టకమ్

1. వసుదేవ సుతం దేవం కంసచాణూర మర్దనమ్
దేవకీ పరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్

2. అతసీపుష్ప సఙ్కాశం హారనూపుర శోభితమ్,
రత్నకఙ్కణ కేయూరం కృష్ణం వన్దే జగద్గురుమ్.

3. కుటిలాలక సంయుక్తం పూర్ణ చన్ద్ర నిభాననమ్,
విలసత్కుణ్డలధరం కృష్ణం వన్దే జగద్గురుమ్.

4. మన్దార గన్ధ సంయుక్తం చారుహాసం చతుర్భుజమ్,
బర్హిపిఞ్ఛావ చూడాఙ్గం కృష్ణం వన్దే జగద్గురుమ్.

# శ్రీకృష్ణాష్టకము

1. దైవమ! వసుదేవ సుతుడ ! ధర జనించి
కంస చాణూర మర్ధన ఖ్యాతి గనిన
దేవకీ పరమానంద దేవ దేవ !
నందతనయా ! జగద్గురూ ! వందనమ్ము.

2. అగసిపూవుల కాంతితో నలరువాడ !
హారనూపుర శోభిత యాదవేంద్ర!
రత్న కంకణ కేయూర రమ్య భూష !
నంద తనయా జగద్గురూ! వందనమ్ము.

3. వంకర నెరికురులతోడ పరిఢవిల్లు
పూర్ణచంద్ర నిభానన పూర్ణ పురుష !
దేవ! లోలకుండల ధరా! దీనబంధు!
నందతనయా! జగద్గురూ! వందనమ్ము.

4. సిక్తమందార గంధ సంయుక్త దేహ !
చారుహాసా! చతుర్భుజా! చక్రధారి
బర్హి పింఛావ చూడాంగ ! బాలకృష్ణ!
నందతనయా! జగద్గురూ వందనమ్ము !

5. ఉత్ఫుల్ల పద్మ పత్రాక్షం నీల జీమూత సన్నిభమ్,
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్.

6. రుక్మిణీ కేళి సంయుక్తం పీతామ్బర సుశోభితమ్,
అవాప్త తులసీ గన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్.

7. గోపికానాం కుచద్వన్ద్వ కుఙ్కుమాఙ్కిత వక్షసమ్,
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్

8. శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలా విరాజితమ్,
శఙ్ఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్.

9. కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్,
కోటిజన్మ కృతం పాపం సద్య ఏవ వినశ్యతి.

5. ఫుల్ల పద్మ పత్రాక్ష! అపూర్వరూప!
నీలజీమూత సన్నిభ! నీరజాక్ష!
యాదవకుల శిరోరత్న! హరి! శౌరి!
నందతనయా! జగద్గురూ! వందనమ్ము!

6. రుక్మిణీకేళి సంయుక్త! రూపసింధు!
పీతవసన సుశోభితా స్మితహాస!
ప్రాప్త తులసీ సువాసనా! ప్రవిమలకల!
నందతనయా! జగద్గురూ! వందనమ్ము!

7. గోపికాకుచద్వయ సకుంకుమలసత్ప్ర
భాస చిహ్నిత వక్షసా! వామరూప!
శ్రీనికేత ! మహేష్వాస! శేషశయన !
నందతనయా ! జగద్గురూ! వందనమ్ము!

8. బహుకఠిన మహోరస్క! శ్రీవత్సచిహ్న!
వరద! వనమాల శోభిత! పరమయోగి!
శంఖ చక్రగదాఖడ్గ శార్ఙ్గధారి!
నందతనయా! జగద్గురూ! వందనమ్ము!

9. పుణ్యకృష్ణాష్టకము, భక్తి పూర్వక మెవ
రేని ప్రత్యుదయమున పఠించు, వారి
కోటి జన్మల పాపముల్ కూలి పోవు,
వరుస సత్వర శుభమగు వాస్తవమ్ము!

# శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రమ్

1. శ్రీకృష్ణః కమలనాథో వాసుదేవ స్సనాతనః,
   వసుదేవాత్మజః పుణ్యోలీలామానుష విగ్రహః

2. శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలో హరిః,
   చతుర్భుజాత్త చక్రాసి గదాశార్ఙ్గాద్యాయుధః.

3. దేవకీనన్దన శ్శ్రీశో నన్దగోప ప్రియాత్మజః,
   యమునావేగసంహారీ బలభద్ర ప్రియానుజః

4. పూతనాజీవిత హరః శకటాసుర భఞ్జనః,
   నన్దవ్రజ జనానన్దీ సచ్చిదానన్ద విగ్రహః.

# శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రము

1. ఇందిరా భర్త! శ్రీకృష్ణ! వందనమ్ము!
వాసుదేవ! సనాతన! పరమపురుష!
పుణ్య వసుదేవ సుతుడవై పుట్టి ధరను
లీల మానవుడయితివి కేళి కొరకు.

2. పరమ శ్రీవత్స కౌస్తుభధర అనంత!
హరి! యశోదా సుతుడుగాను ధర జనించి
వ్రజమున, నడయాడిన చతుర్భుజ! దయాళు!
గరిమ చక్రగదాశార ఖడ్గధారి!

3. శ్రీశ! దేవకీనందన! శ్రీనివాస!
నందగోప ప్రియాత్మజ! సుందరాంగ!
అరయ యమునా నదీ వేగ మణచి మించు
ప్రబల బలరామసోదరా! పద్మనాభ!

4. పూతనాజీవిత హరణ! పూతచరిత!
వరలు శకటనామాసుర భంజనబలి!
నందగోపజనానంద! నందతనయ!
సచ్చిదానంద విగ్రహ! శ్యామదేహ!

5. నవనీత విలిప్తాఙ్గో నవనీత నటోఽనఘః
నవనీత నవాహారో ముచికున్ద ప్రసాదకః

6. షోడశ స్త్రీ సహస్రేశ స్త్రిభఙ్గీ మధురాకృతిః,
శుకవాగమృతాబ్ధీన్దుర్గోవిన్దో యోగినాం పతిః.

7. వత్సవాట చరోఽనన్తో ధేనుకాసుర భఞ్జనః,
తృణీకృత తృణావర్తో యమళార్జున భఞ్జనః.

8. ఉత్తాలతాల భేత్తా చ తమాల శ్యామలాకృతిః,
గోపగోపీశ్వరో యోగీ కోటి సూర్య సమప్రభః.

9. ఇలాపతిః పరంజ్యోతి ర్యాదవేన్ద్రో యదూద్వహః,
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః

5. సురుచిర నవనీత విలిప్త సుందరాంగ!
భావ నవనీత నటసార్వభౌమ! అనఘ!
హారి! నవనీత నవనవాహార! శౌరి!
ఆది ముచికుంద మోక్షప్రసాద దక్ష!

6. షోడశ సహస్ర గోపికా సుందరేశ!
త్రివిధ మంజుల సుమధురాధిస్వరూప!
సరస శుకవాక్సుధాంబుధి చంద్ర! యోగి!
బృంద విమలాధినేత! గోవింద వరద!

7. ధరణి గోవత్స వాట సంచర! అనంత!
ధేనుకాసుర భంజన! దీనబంధు!
పరమగురు! తృణీకృత తృణావర్త వీర!
వరలు యమళార్జున హరణ వరద! యోగి!

8. ఉరుతరోత్తాలతాల సంహరణ దక్ష!
కోమల తమాల నీరద శ్యామదేహ!
గోప గోపికాది భరణ గోపబాల!
కోటిసూర్య సమప్రభా! గోకులేశ!

9. గోపతీ! పరంజ్యోతి! అక్రూరవరద!
యాదవాభ్యుదయకరణా! యాదవేంద్ర!
హేల పీతవసన వనమాలి! శౌరి!
పారిజాతాపహారక పద్మనాభ!

10. గోవర్ధనాచలోద్ధర్తా గోపాల స్సర్వపాలకః,
అజో నిరఞ్జనః కామజనకః కఞ్జలోచనః

11. మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ,
బృన్దావనాన్త సఞ్చారీ తులసీదామ భూషణః.

12. శ్యమన్తక మణేర్హర్తా నరనారాయణాకృతిః,
కుబ్జా కృష్ణామ్బరధరో మాయీ పరమపూరుషః.

13. ముష్టికాసుర చాణూర మల్లయుద్ధ విశారదః,
సంసారవైరీ కంసారి ర్మురారి ర్నరకాన్తకః.

14. అనాదిబ్రహ్మచారీ చ కృష్ణా వ్యసనకర్శకః,
శిశుపాల శిరశ్ఛేత్తా దుర్యోధన కులాన్తకః.

10. కరుణ గోవర్ధనోద్ధారకా! మురారి!
సర్వపాలక గోపాల సార్వభౌమ!
కంజలోచన శ్రీకృష్ణ! కామజనక!
దోష రహిత నిరంజనభూషణాజ!

11. మధురిపూ! మధురానాథ! మారజనక!
ద్వారకా నాయకా! బలీ! వాసుదేవ !
శౌరి బృందావనాంతసంచారి! శౌరి!
సాతోసతులసీదామభూషణ విరాజ!

12. ఆది నిల శమంతకమణిహరణభూష!
కారణ నరనారాయణాకార హరి!
విరస కుబ్జార్పిత వసనధర విహారి!
పరమ మాయాధిపశ్రేష్ఠ! పద్మనేత్ర!

13. ముష్టికాసుర చాణూర ముఖులనెల్ల
మల్లయుద్ధాన గెలిచిన మహిత వీర!
శతవిరాట్కంసవైరి! సంసార వైరి!
ఘోర నరకాంతక! మురారి! వీర! హరి!

14. బ్రహ్మచారి! అనాది! నిరతిశయ! హరి!
వ్యసన కర్శకా! శ్రీకృష్ణ! పద్మనాభ!
అనఘ! శతదోష శిశుపాల హరణదక్ష!
కుటిలనీతి సుయోధన కులవినాశ!

15. విదురాక్రూరవరదో విశ్వరూప ప్రదర్శకః
సత్యవాక్సత్యసంకల్పః సత్యభామారతో జయీ.

16. సుభద్రా పూర్వజో విష్ణుర్భీష్మ ముక్తి ప్రదాయకః,
జగద్గురు ర్జగన్నాథో వేణునాద విశారదః

17. వృషభాసుర విధ్వంసీ బాణాసుర కరాన్తకః,
యుధిష్ఠిర ప్రతిష్ఠాతా బ్హర్హి బర్హావతంసకః.

18. పార్థసారథి రవ్యక్తో గీతామృత మహోదధిః,
కాళీయ ఫణ మాణిక్యరఞ్జిత శ్రీపదామ్బుజః.

19. దామోదరో యజ్ఞభోక్తా దానవేన్ద్ర వినాశకః,
నారాయణః పరంబ్రహ్మ పన్నగాశన వాహనః

15. వర వినయ విదురాక్రూర వరదకృష్ణ!
విశ్వరూప ప్రదర్శక విమలతేజ!
సత్య వాక్సత్య సంకల్ప సన్నిధాన!
సత్యభామారతా! జయా! సరసహృదయ!

16. సన్నుతా! సుభద్రాపూర్వజ! హరి! విష్ణు!
భీష్మ ముక్తి ప్రదాయకా! వీతరాగ!
విశ్వనాథ జగద్గురూ! విశ్వతేజ!
వేణునాద విశారద! విశ్వకీర్తి

17. గర్వి వృషభాసుర వినాశకర విహార!
కఠిన బాణాసురకరాంతక వర! వీర!
శ్రేష్ఠ ధర్మరాజ పునః ప్రతిష్ఠ శూర!
బర్హి బర్హావతంసక వరవిహార!

18. పార్థసారథి! అవ్యక్త! భాసురవర!
ప్రబల గీతామృతాంబుధి పరమహంస!
ఘోర కాళీయ ఫణమణి సారకాంతి
భాసుర మనోజ్ఞ రంజిత పాదపద్మ!

19. యజ్ఞభోక్త! దామోదర! అచ్యుత! హరి!
దానవేంద్ర వినాశక! దీనబంధు!
వరద! నారాయణా పరంబ్రహ్మ! శౌరి!
పన్నగాశన వాహన! పద్మనాభ!.

# శ్రీకృష్ణ గోవింద దామోదర స్తోత్రమ్

1. అగ్రే కురూణామథ పాండవానాం
దుశ్శాసనేనాహృత వస్త్రకేశా !
కృష్ణా తదాక్రోశదనన్య నాథా
గోవింద దామోదర మాధవేతి

2. శ్రీకృష్ణ విష్ణో మధుకైటభారే
భక్తానుకంపిన్ భగవన్ మురారే !
త్రాయస్వమాం కేశవ లోకనాథ
గోవింద దామోదర మాధవేతి

3. విక్రేతు కామాకిల గోపకన్యా
మురారి పాదార్పిత చిత్తవృత్తిః
దధ్యాదికం మోహవశాదవోచద్
గోవింద దామోదర మాధవేతి

4. ఉలూఖలే సంభృత తండులాంశ్చ
సంఘట్టయన్తో ముసలైః ప్రముగ్ధాః
గాయన్తి గోప్యోజనితానురాగా
గోవింద దామోదర మాధవేతి

# శ్రీకృష్ణ గోవింద మాధవస్తోత్రము

1. దుష్ట కౌరవ సభలోన దుస్ససేను
వలన ద్రౌపది అవమాన భరిత హృదయ
దిక్కు నీవని ప్రార్థించె దీనయగుచు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు

2. శ్రీహరి! మురారి! కేశవ! సిద్ధవరద!
భక్తమందార! రక్షింపు పరమపురుష!
దిక్కులేని వారికి నీవ దిక్కుగాన
కృష్ణ! గోవింద! మాధవ! కృపనుగనుమ!

3. పాలు, పెరుగమ్మ బోయెడు భామ గోపి
మాధవుని పైని మోహాన మనసు నిలిపి
పాలు పెరుగని అరవక, పలికె ప్రేమ
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు!

4. ధాన్యమును రోటిలోబోసి దంచునపుడు
దంపుడుల పాటలు వదలి, దైత్యదమను
పాటలను గోపికలు ప్రీతి పాడిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

5. కాచిత్కరామ్భోజ పుటే నిషణ్ణం
క్రీడాశుకం కింశుకరక్త తుండమ్
అధ్యాపయామాస సరోరుహాక్షీ
గోవింద దామోదర మాధవేతి

6. గృహే గృహే గోప వధూ సమూహః
ప్రతిక్షణం పింజర సారికాణామ్
స్ఖలద్గిరం వాచయితుం ప్రవృత్తో
గోవింద దామోదర మాధవేతి

7. పర్యఙ్కికా భాజమలం కుమారం
ప్రస్వాపయన్త్యోఽఖిల గోపకన్యాః
జగుః ప్రబంధం స్వరతాలబన్ధం
గోవింద దామోదర మాధవేతి

8. రామానుజం వీక్షణ కేలిలోలం
గోపీ గృహీత్వా నవనీత గోలమ్
ఆబాలకం బాలకమాజుహావ
గోవింద దామోదర మాధవేతి

9. విచిత్ర వర్ణాభరణాభిరామే
అభిదేహి వక్త్రామ్బుజ రాజహంసి
సదామదీయే రసనాగ్రరఙ్గే
గోవింద దామోదర మాధవేతి

5. ఎరుపు హస్త పద్మములోని ఎఱ్ఱముక్కు
చిలుక బద్మాక్షి గోపిక చీరి పలికి
నిపుణ మతితోడ ప్రేమగా నేర్పెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు

6. మోహ పరవశ గోపికల్ ముద్దుగాను
గోరువంకల కింటింట కూర్మి మీర
నేర్పున హరిమీది ప్రేమతో నేర్పిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

7. శిశువులను ఊయలల లోనచేర్చి, గోపి
కామణుల్ ప్రతి గృహమందు ప్రేమతో, ప్ర
బంధముల్ స్వర తాళాల పాడిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

8. చేత వెన్న పట్టుకొనిన చిన్ని గోప
కన్య, గోపబాలకులను కలిపి వరుస
చిలిపిగా కృష్ణ పేరనే పిలిచెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణ యనుచు

9. చిత్ర వర్ణాభరణ విభూషిత ముఖాంబు
జవిలసద్రాజ హంసి! అస్మద్రసనము
పై సదా భగవన్నామ పదముపాడు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

10. అఙ్కాధిరూఢం శిశుగోపగూఢం
స్తనం ధయన్తం కమలైక కాన్తమ్
సంబోధ యామాస ముదాయశోదా
గోవింద దామోదర మాధవేతి

11. క్రీడన్తమన్త ర్వ్రజమాత్మజం స్వం
సమం వయస్యైః పశుపాలబాలైః
ప్రేమ్ణా యశోదా ప్రజుహావ కృష్ణం
గోవింద దామోదర మాధవేతి

12. యశోదయా గాఢములూఖలేన
గోకణ్ఠపాశేన నిబధ్యమానః
రురోదమన్దం నవనీత భోజీ
గోవింద దామోదర మాధవేతి

13. నిజాఙ్గనే కఙ్కణకేలిలోలం
గోపీ గృహీత్వా నవనీత గోలమ్
ఆమర్దయత్పాణితలేన నేత్రే
గోవింద దామోదర మాధవేతి

14. గృహేగృహే గోప వధూకదమ్బాః
సర్వేమిలిత్వా సమవాయ యోగే
పుణ్యాని నామాని పఠన్తి నిత్యం
గోవింద దామోదర మాధవేతి

10. గోప కులమున శిశువై నిగూఢరీతి
తల్లిఒడిచేరి పాల్ద్రావు తనతనయుని
శ్రీశుడనుచు యశోద కీర్తించెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

11. గోవ్రజపు గోపబాలుర గూడియాడ
ముదిత హృదయ మాత యశోద మురిసిపోయి
ప్రేమ మీరగ తనయుని పిలిచెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

12. చిట్టి నవనీత చోరుని గట్టె రోట
పలుపున యశోద! గోపాలబాలుడు మెల
మెల్ల రోదించ, ప్రేమతో తల్లిపాడె
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

13. కంకణాభరణ విభూషు పంకజాక్షు
కేళిలోలుని గోపిక కేలు చాచి
పట్టి; కనుల వెన్ననురుద్ధి పాడెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

14. గోపికామణుల్ ప్రతియింట గోవ్రజమున
పరమ పురుషుని నామాలు పలువిధాల
ఏమరక సదా వారు కీర్తింతురిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

15. మందార మూలే వదనాభిరామం
బిమ్బాధరే పూరిత వేణునాదమ్
గో గోప గోపీ జనమధ్య సంస్థం
గోవింద దామోదర మాధవేతి

16. ఉత్థాయ గోప్యోఽపరరాత్ర భాగే
స్మృత్వా యశోదాసుత బాలకేలిమ్
గాయన్తి ప్రోచ్చైర్దధి మన్థయన్త్యో
గోవింద దామోదర మాధవేతి

17. జగ్ధోఽథ దత్తో నవనీత పిండో
గృహే యశోదా విచికిత్సయన్తీ
ఉవాచ సత్యం వదహే మురారే
గోవింద దామోదర మాధవేతి

18. అభ్యర్చ్యగేహం యువతిః ప్రవృద్ధ
ప్రేమ ప్రవాహోదధి నిర్మమన్థ
గాయన్తి గోప్యోథ సఖీసమేతా
గోవింద దామోదర మాధవేతి

19. క్వచిత్ ప్రభాతే దధి పూర్ణపాత్రే
నిక్షిప్యమన్థం యువతీ ముకున్దమ్
ఆలోక్య గానం వివిధం కరోతి
గోవింద దామోదర మాధవేతి

15. గోప గోపీజనులతోడ గోవులకడ
వెలసి మందారములనీడ వేణుగాన
వదన మోహన కృష్ణుని పాడిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

16. చిలిపి కృష్ణుని క్రీడలు చింతజేసి
గోప కాంతలు నిద్రమేల్కొన్న వెంట
పెరుగు చిలుకుచు పాడిరి ప్రేమనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

17. ఉట్టిలోనున్న వెన్నలు జట్టులోని
నేస్తగాండ్రకే ఇచ్చితో! నీవ మెసవి
నావా? శ్రీహరీ! చెప్పుమన్నది యశోద
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

18. లలిత సుందరగృహము నలంకరించి
గోపిక యొకర్తు సఖులతో గూడి వేడ్క
పెరుగ; ప్రేమదధి చిలికె ప్రేమతోడ
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

19. ఒక శుభోదయ మందు గోపిక, మురారి
దర్శనావలోకనమగ్న తత్పరతను
పెరుగు కుండలో కవ్వము పెట్టిపాడె
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

20. క్రీడాపరం భోజన మజ్జనార్థమ్
హితైషిణీ స్త్రీ తనుజం యశోదా
ఆజూహవత్ ప్రేమపరిప్లుతాక్షీ
గోవింద దామోదర మాధవేతి

21. సుఖం శయానం నిలయే చ విష్ణుం
దేవర్షి ముఖ్యామునయః ప్రపన్నాః
తేనాచ్యుతే తన్మయతాం వ్రజన్తి
గోవింద దామోదర మాధవేతి

22. విహాయ నిద్రామరుణోదయే చ
విధాయ కృత్యాని చ విప్రముఖ్యాః
వేదావసానే ప్రపఠన్తి నిత్యం
గోవింద దామోదర మాధవేతి

23. బృందావనే గోపగణాశ్చ గోప్యో
విలోక్య గోవింద వియోగఖిన్నామ్
రాధాం జగుః సాశ్రు విలోచనాభ్యాం
గోవింద దామోదర మాధవేతి

24. ప్రభాత సఞ్చార గతానుగావ
స్తద్ రక్షణార్థం తనయం యశోదా
ప్రాబోధయత్ పాణి తలేన మన్దం
గోవింద దామోదర మాధవేతి

20. ఆటపాటల మునిగిన యదుకిశోరు
నకును, స్నానభోజనములను కలిగింప
ప్రేమతో యశోదాదేవి పిలిచెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

21. క్షీరసాగరమున సదాశేషశయన
విష్ణుమూర్తిపయి ప్రపత్తి వేడ్కతోడ
ముదిత హృదయ మహర్షులు మురిసిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

22. భద్ర భూసురులుదయాన నిద్రలేచి
కాలకృత్యములను దీర్చి, మూలమైన
వేద పఠనము చివరగా వేడిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

23. కృష్ణ విరహాభరము చేత ఖిన్నురాలు
రాధ, బృందావనము నందు బాధ గాంచి
గోప గోపీ జనము పాడె గోముగాను
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

24. వేగుజాము గోవులు మేత కేగుచుండ
వాని రక్షించు కొరకునై వాడుకగను
కొమరుని యశోద నిద్రమేల్కొలిపెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

25. ప్రవాలశోభా ఇవ దీర్ఘకేశా
వాతామ్బు పర్ణాశన పూతదేహాః
మూలే తరూణాం మునయః పఠన్తి
గోవింద దామోదర మాధవేతి

26. ఏవం బ్రువాణా విరహాతురా భృశం
వ్రజస్త్రియః కృష్ణ విషక్తమానసాః
విసృజ్య లజ్జాం రురుదుః స్మ సుస్వరం
గోవింద దామోదర మాధవేతి

27. గోపీ కదాచిన్మణి పఞ్జరస్థం
శుకం వచో వాచయితుం ప్రవృత్తా
ఆనంద కన్ద వ్రజచన్ద్ర కృష్ణ
గోవింద దామోదర మాధవేతి

28. గోవత్స బాలైః శిశుకాకపక్షం
బధ్నన్తమమ్భోజ దలాయతాక్షమ్
ఉవాచ మాతా చిబుకం గృహీత్వా
గోవింద దామోదర మాధవేతి

29. ప్రభాతకాలే వరవల్లవౌఘా
గోరక్షణార్థం ధృతవేత్రదణ్డాః
ఆకార యామాసురనన్త మాద్యం
గోవింద దామోదర మాధవేతి

25. చివురు శోభల కేశులు, పవన, పర్ణ
జలములాహార పూత దేహులు, మునిగణ
ము, తరుమూలముల వెలసి మురిసి పాడె
విష్ణు! గోవింద! మాధవ ! కృష్ణయనుచు.

26. వ్రజము గోపికల్ కృష్ణుని పైని విరహ
బాధ క్రుంగి సహజ లజ్జవదలి, వగభ
రించలేక గట్టిగను రోదించిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

27. పంజరములోని చిలుకకు పలువిధాల
మాటలను నేర్పు గోపి, ప్రేమ పలికె వ్రజ
చంద్ర! ఆనంద కందమా! శ్యామదేహ!
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు!

28. కాక పక్షము సవరించి కట్టుకొనుచు
గోప బాలురతోనున్న గోముకృష్ణు
ప్రీతి చిబుకమంటి యశోద పిలిచెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు

29. గోప బాలకు లుదయాన గోగణమును
కఱ్ఱలు గొని ఏమరకుండ కాయువేళ
పరమ పురుషుననంతుని పాడిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

30. జలాశయే కాలియ మర్దనాయ
యదాకదమ్బా దపతన్మురారిః
గోపాఙ్గనాశ్చుక్రుశురేత్య గోపా
గోవింద దామోదర మాధవేతి

31. సరోవరే కాలియనాగబద్ధం
శిశుం యశోదాతనయం నిశమ్య
చక్రూర్లుఠన్త్య పథిగోప బాలా
గోవింద దామోదర మాధవేతి

32. అక్రూరమాసాద్య యదా ముకున్ద
శ్చాపోత్సవార్థం మధురాం ప్రవిష్టం
తదా స పౌరైర్జయతీత్యభాషి
గోవింద దామోదర మాధవేతి..

33. కంసస్య దూతేన యదైవ నీతౌ
బృందావనాన్తాద్ వసుదేవసూను
రురోద గోపీ భవనస్య మధ్యే
గోవింద దామోదర మాధవేతి

34. అక్రూర యానే యదువంశ నాథం
సంగచ్ఛమానం మధురాం నిరీక్ష్య
ఊచు ర్వియోగాత్ కిలగోప బాలా
గోవింద దామోదర మాధవేతి

30. కాళియుని మర్దనార్థము కడిమి చెట్టు
నుండి మడుగులో దూకిన గండకృష్ణు
గూర్చి గోప గోపీజన మార్చెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

31. సరసునందు కాళీయుడు పరమపురుషు
చుట్టి బంధించి నాడన్న గుట్టుతెలిసి
దుఃఖపడిరి గోపాలురు దొర్లిదొర్లి
విష్ణు ! గోవింద! మాధవ! కృ ష్ణయనుచు

32. సద్గుణాక్రూరుడు కొనిరాన్ చాపయాగ
దర్శనార్థము కృష్ణు మోదమలరగను
పొడగని మధుర పౌరులు పొగడిరిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు

33. భక్తుడక్రూరుడు కొని పో వాసుదేవు
డరుగ, బృందావనము వీడి వ్యాకులపడి
శోక మగ్నయై ఏడ్చె యశోద యిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

34. మధురకేగ అక్రూరుతో మధురిపుండు,
విరహతప్తలు గోపికల్ పరమపురుషు
పైని బాళితో పాడిరి పలుతెరగుల
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

35. చక్రస్థ గోపీ నలినీ వనాన్తే
కృష్ణేన హీనా కుసుమేశయానా
ప్రఫుల్ల నీలోత్పలలోచనాభ్యాం
గోవింద దామోదర మాధవేతి

36. మాతా పితృభ్యాం పరివార్యమాణా
గేహం ప్రవిష్టా విలలాప గోపీ
ఆగత్య మాం పాలయ విశ్వనాథ
గోవింద దామోదర మాధవేతి

37. బృందావనస్థం హరిమాశు బుద్ధ్వా
గోపీగతా కాపి వనం నిశాయామ్
తత్రాప్య దృష్ట్వాతి భయాదవోచద్
గోవింద దామోదర మాధవేతి

38. సుఖం శయానా నిలయే నిజేపి
నామాని విష్ణోః ప్రవదన్తి మర్త్యాః
తే నిశ్చితం తన్మయతాం వ్రజన్తి
గోవింద దామోదర మాధవేతి

39. సానీరజాక్షీమవలోక్య రాధాం
రురోద గోవింద వియోగఖిన్నామ్
సఖీ ప్రఫుల్లోత్పల లోచనాభ్యాం
గోవింద దామోదర మాధవేతి

35. పద్మ వనమందు గోపిక పద్మనేత్ర
పుండరీకాక్షు గానక పుష్పశయన
మించు దుఃఖమ్ముతోడ రోదించెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

36. అడుగు బయటిడనీయక అడ్డగింప
తల్లిదండ్రులు; గృహమందె తల్లడిల్లు
గోపి విలపించె రక్షింప గోప బాల!
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

37. నళినయనుడు బృందావనమున నున్న
వార్త విన్న గోపిక రాత్రి వనము జేరి
కానలేక కృష్ణుని, ఏడ్చు కనలికనలి
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

38. సుఖముగా గృహ మందు విష్ణు స్తుతులను
చేయు మానవుల్ సర్వదా చింతలేక
దైవ కృపకు పాత్రులగుట తథ్యమిలను
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

39. పద్మలోచన రాధిక పద్మనాభ
విరహ తప్తురాలను కడు వివశయగుచు
కాంచి చెలి పద్మనయన రోదించెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

40. జిహ్వే రసజ్ఞే మధుర ప్రియాత్వం
సత్యం హితం త్వాం పరమం వదామి
ఆవర్ణయేథా మధురాక్షరాణి
గోవింద దామోదర మాధవేతి

41. ఆత్యన్తిక వ్యాధిహరం జనానాం
చికిత్సకం వేదవిదోవదన్తి
సంసార తాపత్రయనాశబీజం
గోవింద దామోదర మాధవేతి

42. తాతాజ్ఞయా గచ్ఛతి రామచన్ద్రే
సలక్ష్మణేఽరణ్య చ యే ససీతే
చక్రన్ద రామస్య నిజా జనిత్రీ
గోవింద దామోదర మాధవేతి

43. ఏకాకినీ దణ్డక కాననాన్తాత్
సానీయమానా దశకన్ధరేణ
సీత తదాక్రన్ద దనన్యనాథా
గోవింద దామోదర మాధవేతి

44. రామాద్వియుక్తా జనకాత్మజాసా
విచిన్తయన్తీ హృది రామరూపమ్
రురోద సీతా రఘునాథ పాహి
గోవింద దామోదర మాధవేతి

40. నాల్క రుచులెర్గి తియ్యగా బల్కుదాన!
వెలయు హిత సత్యశ్రేష్ఠముల్ తెలుపుచుంటి
మించు మధురాక్షరాల కీర్తించు మిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

41. ప్రజల ఆత్యంతికంబగు వ్యాధిహారము
త్రయము సంసార బాధల రాయురోగ
హారిణి యటంచు వేదాంతులందురిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు.

42. తండ్రి యాజ్ఞను రాముడు దండకకును
సీతతో లక్ష్మణుని గూడి శ్రీఘ్రమేగ
తల్లి కౌసల్య రోదించె మెల్లనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! జిష్ణువనుచు

43. సీత దండకాటవిలోన భీతిచెంద
రావణుడపహరింపగా రయముతోడ
జనకజాక్రందనముచేసె శరణునీవె!
విష్ణు! గోవింద! మాధవ! జిష్ణు వనుచు.

44. జనక నందన రాముని సంస్మరించి
హృదయవేదనాభరిత శోకించెనిట్లు
ఓ సురనరసంరక్షక! ఓము రామ!
విష్ణు! గోవింద! మాధవ! జిష్ణువనుచు

45. ప్రసీద విష్ణో రఘువంశనాథ
సురాసురాణాం సుఖదుఃఖహేతో
రురోద సీతా తు సముద్రమధ్యే
గోవింద దామోదర మాధవేతి

46. అన్తర్జలే గ్రాహగృహీత పాదో
విస్సృష్ట విక్లిష్ట సమస్తబంధుః
తదా గజేన్ద్రో నితరాం జగాద
గోవిందదామోదర మాధవేతి

47. హంసధ్వజః శంఖయుతో దదర్శ
పుత్రం కటాహే ప్రపతన్తమేనమ్
పుణ్యాని నామాని హరేర్జపన్తం
గోవింద దామోదర మాధవేతి

48. దుర్వాససో వాక్యముపేత్య కృష్ణా
సా చాబ్రవీత్ కాననవాసినీశమ్
అన్తః ప్రవిష్టం మనసా జుహావ
గోవింద దామోదర మాధవేతి

49. ధ్యేయః సదా యోగిభిరప్రమేయః
చిన్తా హరశ్చిన్తిత పారిజాతః
కస్తూరికా కల్పిత నీలవర్ణో
గోవింద దామోదర మాధవేతి

45. రావణాపహృత యయిన రాము సీత
అబ్ధి పైభాగమున వేగ నరుగువేళ
రమ్ము రక్షింపుమని ఏడ్చె రామచంద్ర!
విష్ణు ! గోవింద ! మాధవ ! జిష్ణు వనుచు.

46. నీటను గజేంద్రు మకరము నిగిడి పట్ట
కరియు ప్రార్థించె శ్రీహరి ! కరుణజూడ
మించు సంసార బంధముల్ తెంచుకొంటి
విష్ణు ! గోవింద! మాధవ! జిష్ణు వనుచు

47. వేడి నూనె సుధన్వుడు మాడుచుండ
తండ్రి హంసధ్వజుడు గాంచి తల్లడిలక
కొడుకు విష్ణు భక్తుడగుట కూర్మివేడె
విష్ణు ! గోవింద! మాధవ ! కృష్ణ యనుచు

48. అరిది దుర్వాసు డేతేర అతిథిగాను
ధర్మజు కడకు, వేడెను ద్రౌపది, హరి !
కరివరద ! రక్ష నీవని గరిమనిట్లు
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు

49. చింత పోగొట్టి శ్రీహరి క్షేమ మొసగు
పారిజాతము, యోగులు భక్తులకును
నీలవర్ణు డెపుడు కీర్తనీయుడిట్లు
విష్ణు ! గోవింద! మాధవ ! కృష్ణ యనుచు

50. సంసార కూపే పతితో త్యగాథే
మోహాన్ధపూర్ణే విషయాభితప్తే
కరావలమ్బం మమ దేహి విష్ణో
గోవింద దామోదర మాధవేతి

51. త్వామేవ యాచే మమ దేహి జిహ్వే
సమాగతే దణ్డధరే కృతాన్తే
వక్తవ్యమేవం మధురం సుభక్త్యా
గోవింద దామోదర మాధవేతి

52. భజస్వ మంత్రం భవబంధ ముక్త్యై
జిహ్వేరసజ్ఞే సులభం మనోజ్ఞమ్
ద్వైపాయ నాద్యైర్మునిభిః ప్రజప్తం
గోవింద దామోదర మాధవేతి

53. గోపాల వంశీధర రూపసిన్ధో
లోకేశ నారాయణ దీనబన్ధో
ఉచ్చస్స్వరైస్త్వం వద సర్వదైవ
గోవింద దామోదర మాధవేతి

54. జిహ్వే సదైవం భజ సున్దరాణి
నామాని కృష్ణస్య మనోహరాణి
సమస్త భక్తార్తి వినాశనాని
గోవింద దామోదర మాధవేతి

50. సర్వ మోహాంధ పూర్ణ సంసార కూప
పతిత విషయలోలురము కాపాడుమంచు
తమకు చేయూత నిమ్మని తలతురిట్లు
విష్ణు ! గోవింద! మాధవ ! కృష్ణ యనుచు

51. అరుగుదేర దండధరుడు అంత్యమందు
మధురమైన నీ నామము మంజులమ్ము
భక్తితోమదీయరసన పాడుగాక !
విష్ణు ! గోవింద! మాధవ ! కృష్ణ యనుచు

52. జిహ్వా! భవబంధ ముక్తికై చింత చేతు
రెవని నామము వ్యాసాదులెల్ల వేళ
లట్టి నామస్మరణ సదా అనుమతిమ్ము
విష్ణు ! గోవింద! మాధవ ! కృష్ణ యనగ

53. గోపికాలోల ! లోకేశ ! రూపసింధు!
గానలోల! వంశీధరా! దీనబంధు!
ఉచ్చనాదముతో నాల్క! ఉచ్చరించు
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు.

54. సుందరము మనోహరములు సురుచిరములు
కృష్ణనామాలు సర్వదా కీర్తిసేయు
నాలుకా ! సర్వభక్తార్తి నాశకాలు
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు

55. గోవింద గోవింద హరే మురారే
గోవింద గోవింద ముకున్ద కృష్ణ
గోవింద గోవింద రథాఙ్గ పాణే
గోవింద దామోదర మాధవేతి

56. సుఖావసానే త్విదమేవ సారం
దుఃఖావసానే త్విదమేవ గేయమ్
దేహావసానే త్విదమేవ జప్యం
గోవింద దామోదర మాధవేతి

57. దుర్వార వాక్య పరిగృహ్య కృష్ణాం
మృగీవ భీతాతు కథం కథఞ్చిత్
సభాం ప్రవిష్టా మనసాజుహావ
గోవింద దామోదర మాధవేతి

58. శ్రీకృష్ణ రాధావర గోకులేశ
గోపాల గోవర్ధన నాథ విష్ణో
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

59. శ్రీనాథ విశ్వేశ్వర విశ్వమూర్తే
శ్రీ దేవకీ నన్దన దైత్యశత్రో
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

55. నందనందన ! దేవ ! ముకుంద ! హరి! ము
రారి ! గోపాల బాల! రథాంగ పాణి !
కరివరద ! యదుభూషణ ! కంసహనన !
కృష్ణ ! గోవింద ! మాధవ ! గిరిధరుండ!

56. మనకు సుఖసార మీనామ మనన మిలను,
నిండు దుంఖాంతమున కీర్త నీయమిలను,
నిరయ సమయమందున జపనీయ మిలను,
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనగ

57. వేగ దుర్వార వాక్యము విన్న దగుచు
బాధతో ద్రుపదతనయ వడిగ వచ్చి
లేడి వోలె భీతయగుచు వేడెనిట్లు
విష్ణు! గోవింద! మాధవ! కృష్ణయనుచు

58. శ్రీహరి ! మురారి ! గోపాల ! శ్రీశ! వరద !
హరి ! రాధాప్రియతమ ! కంసారి ! మాలి !
విష్ణు ! గోవింద ! మాధవ కృష్ణ యనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

59. విశ్వనాథ ! రమాప్రియ ! విశ్వమూర్తి !
దేవకీసుత ! దైత్యారి ! దీన బంధు !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణ యనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

60. గోపీపతే కంసరిపో ముకుంద
లక్ష్మీపతే కేశవ వాసుదేవ
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

61. గోపీజనాహ్లాదకర వ్రజేశ
గోచారణారణ్య కృతప్రవేశ
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

62. హరే మురారే మధుసూదనాద్య
శ్రీరామ సీతావర రావణారే
జిహ్వే పిబస్వామృతమేత దేవ
గోవింద దామోదర మాధవేతి

63. శ్రీ యాదవేన్ద్రాద్రిధరామ్బుజాక్ష
గోగోపగోపీ సుఖదానదక్ష
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

64. ధరాభరోత్తారణ గోపవేష
విహారలీలాకృత బన్ధుశేష
జిహ్వే పిబస్వామృతమేత దేవ
గోవింద దామోదర మాధవేతి

60. గోపికానాథ ! కంసారి ! గోప బాల!
వరద ! శ్రీపతి ! కేశవ ! వాసుదేవ!
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క!

61. గోపికామనోవల్లభ ! గోవుల పరి
రక్షణ కడవి జేరిన వ్రజకులపతి !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణ యనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

62. మురహరా ! మధుసూదన ! పరమపురుష !
రామ ! సీతాపతి ! వరద ! రావణారి !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణ యనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క!

63. యాదవేంద్ర ! అంబుజనేత్ర ! అద్రిధరుడ !
పరమ సుఖదాయి గోగోప వనితలకును
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

64. విశ్వభరము బాపగ గోప వేషధారి !
బహువినోద లీలాకృత బంధు శేష !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణ యనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

65. బకీబకాఘాసుర ధేనుకారే
కేశీతృణావర్త విఘాతదక్ష
జిహ్వే పిబస్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి

66. శ్రీ జానకీ జీవన రామచన్ద్ర
నిశాచరారే భరతాగ్రజేశ
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

67. నారాయణానన్త హరే నృసింహ
ప్రహ్లాద బాధాహర హే కృపాలో
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

68. లీలామనుష్యాకృతి రామరూప
ప్రతాప దాసీకృత సర్వభూప
జిహ్వే పిబస్వామృతమేత దేవ
గోవింద దామోదర మాధవేతి

69. శ్రీకృష్ణ గోవింద హరే మురారే
హేనాథ నారాయణ వాసుదేవ
జిహ్వే పిబస్వామృతమేత దేవ
గోవింద దామోదర మాధవేతి

65. అఘబకాసుర ధేనుకాహనన దక్ష !
అసుర కేశీతృణావర్త హరణదక్ష !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

66. రమణి జానకీ జీవన రామచంద్ర !
అసుర విధ్వంస చణ భరతాగ్రజేశ !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

67. హరి ! నారాయణానంత ! హరి నృసింహ !
వరద ! ప్రహ్లాద బాధానివారణ చణ !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

68. రమణ లీల మానవ వేష రామచంద్ర
సారవీరదాసీకృత సర్వభూప !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

69. సరస గోపాల ! లక్ష్మీశ ! హరి ! మురారి !
వాసుదేవ ! నారాయణ ! పరమ పురుష !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణయనుచు
తీయనౌనామ సుధగ్రోలు మోయి నాల్క !

70. వక్తుం సమర్థోపి నవక్తి కశ్చి
దహో జనానాం వ్యసనాభిముఖ్యమ్
జిహ్వే పిబస్వామృత మేత దేవ
గోవింద దామోదర మాధవేతి

**ఇతి శ్రీ బిల్వ మఙ్గలవిరచితం**
**శ్రీ గోవింద దామోదర స్తోత్రం సంపూర్ణమ్**



70. చెప్ప శక్తులై యుండియు చెప్పకుండు
హీన జనుల కష్టస్థితి నేమి చెప్ప !
విష్ణు ! గోవింద ! మాధవ ! కృష్ణ యనుచు
తీయనౌ నామసుధ గ్రోలు మోయి నాల్క !

**ఇది శ్రీ బిల్వ మంగల విరచిత**
**శ్రీ గోవింద మాధవ స్తోత్రము సంపూర్ణము.**

